


శ్రీ గాయత్ర్యై నమః

# శ్రీ గాయత్రీ స్తవాష్టోత్తర శతకము

## పూసపాటి రంగనాయకామాత్యకవి

ప్రణీతము

యడవల్లి కాపురస్థులు
బ్రహ్మశ్రీ యనమండ్ర వెంకటసుబ్బయ్యశాస్త్రిగారి
ద్రవ్యసహాయముచే
ప్రత్తిపాటి సూర్యనారాయణగారి స్వకీయ
లక్ష్మీ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.
నరసరావుపేట.

ప్రథమముద్రణము ౫౦౦ ప్రతులు
వైవస్వతమన్వంతరము ౨౮ వ కలియుగము
గతాబ్దములు ౫౦౩౭ ధాతృవత్సరము



వెల ౦-౮-౦



శ్రీ గాయత్ర్యై నమః

# శ్రీ గాయత్రీ స్తవాష్టోత్తర శతకము



శా॥ శ్రీగీర్వాణి శుభాంగి భక్తవరదా! ఋక్ప్రదా బాలికా!
నాగావాస! శివాదిపూజితపదా! నారాయణీ! శాంభవీ!
నాగర్యప్రద! శాశ్వతా విమలగాం । ధర్వప్రియా మోహినీ
౧ ఆగాత్యాంధ తమఃప్రచండకరి గా । యత్రీ దయాంభోనిధీ॥ ౧

శా॥ అజ్ఞుండన్ శిశువన్ జడుండ భవదీ । యంబైన స్తోత్రంబు మున్
ప్రాజ్ఞుల్సేసినరీతిఁ జేయుటకు నే । రన్ భక్తి ముఖ్యంబ కా
దా! జ్ఞానమ్మునకంటె నోటనిపుడే । నర్పించు స్తోత్రంబునో
యజ్ఞానాంధతమిస్రసహారకొను గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౨

మ॥ ఫలమో పుష్పమొ పత్రమో జలమునో । భక్తిన్ సమర్పించుచోఁ
దలిమిష్టాష్టాన్నముగాగ్రహింతువని, భ । క్తవ్రాత మెందేనియున్
బలుకాడన్ విని పద్యమాలికను స । మ్యగ్భక్తి నర్పింతునో
అలినీలాలక నేఁడు గైకొనుము గా । యత్రీ దయాంభోనిధీ ॥ 3

మ॥ తలి నీవన్ననొ శక్తిరూపిణివి వ్య । ర్థంబౌను నీపూజకు
త్పలచాంపేయములాయజాదులును శు । భ్రంబుల్ కదా కావున్
బలినీకిచ్చెద భక్తిపూర్వకముగన్ । శార్దూల మత్తేభముల్
అలతిన్ జేయక వేడ్కఁ గైకొనుము గా । యత్రీ దయాంభోనిధీ॥ ౪

శా॥ దత్తాత్రేయవరప్రదా! గుణనిధీ । దౌర్భాగ్య విధ్వంసినీ
మత్తేభంబులుగాని వ్యాఘ్రములనే । మాకిచ్చుచోఁ జాలదే

---

౧ ఆగాత్యము—మూఢత్వము

సత్త్రీఁ బట్టి యొసంగరాదె యనుచున్ । సంధ్యాతలంతే మొ సూ
అత్రిఁ సూర్యులుగన్గ్రి తేఁ జన్రులు గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౫

మ॥ మునుపా గాధిజుపై వసిష్ఠ ఋషిపై । భూపాలుఁడౌ రాముపై
ఘనుఁడౌ భార్గవ రాముపై నుశనుపై । గాంగేయుపై వ్యాసుపై
జననీ నీదగు నేకటాక్షమును బ్రస్థాపించితో దానినే
యనుషంగాఁదగు నేఁడు నాపయికి గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౬

శా॥ గీర్వాణుల్ ఋషిచంద్రులున్ । మునునినుంగీర్తించినా రెంతయున్
గీర్వాణంబున మాతృభాషయగుటన్ । వేఁడ్కం దనాంధ్రమ్మునన్
సర్వజ్ఞామెదియైన నివ్వొకటిగన్ । భాషింతు నా బాసనే
నర్వాచనము చేయఁజాలఁగద గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౭

మ॥ నిను ధ్యానించిన నొక్కమారె దగ్విజుల్ । విప్రాపులై వెంటనే
కనదుత్తుంగ సుధర్మ హర్మ్యముల సౌ । ఖ్యంబొది యీ లోకమం
దున నాలోకమునన్ సుఖింతురని । సంతోషించి నిన్ జేరనా
ననఘున్ జేయవె నిన్ను వేఁడునను గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౮

శా॥ నీ ధ్యానంబుననుండు పామరుని నే । నిన్ జేరఁగాఁదీసివే
స్వాధ్యాయంబుననుంచి కష్టపుఁబరీ । క్షల్సేసి, యాపిమ్మటన్
అధ్యాత్మంబుఁ బ్రబోధ చేయుటకునై । హార్దాచిత్త దిత్తా బవె
అధ్యాపించెదు నిన్నుఁగొల్చెదను గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౯

మ॥ అలనీరేజభవాదిదేవతలు ది । వ్యాబ్దంబు లెన్నేని ని
శ్చలయోగంబుననుండియున్ నినుఁగనన్ । జాలంగ లేరన్నఁ జం
చలచిత్తుండను భూమిదేవుఁటగుటన్ । గాంక్షించితిన్ నేఁడు నా
కల వెట్లయ్యెదవో యెఱుంగఁగద గా । యత్రీదయాంభోనిధీ ॥ ౧౦

శా॥ అంభోజాసనుఁ డాదిమూర్తులు నినున్ । బ్రార్థించినారంచు నే
సంభావించితిఁజుమ్మి నెమ్మనములో । సౌమ్యాకృపాదృష్టి సం
రంభంబుల్ దొలఁగించి కావఁగనగున్ । బ్రహ్మాదులన్ బోతె న
న్నంభోరాశిగంభీర, పంచముఖి గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౧౧

మ॥ శతకంబొక్కటిఁ బాడినంతటనె నీ । స్వాధీనమే నాదు నే
యతులంబైన తపంబుఁజేయుమనినీ । వందేమొ యీ వేళ జీ

వితమున్నన్ శతవర్షముల్ రుజలునా । విస్తారముల్ గానయే
వ్యతిరేకంబు ఘటిల్లునో యెఱుఁగ గా। యత్రీ దయాంభోనిధీ ౧౨

శా॥ దారిద్ర్యాంధత మిస్రహారివని ప్ర । స్తావింతు రీగాని యె
వ్వారిన్ బ్రోచితొ యెన్నఁడో తెలియన। వ్వారున్న ప్రాచీనమౌ
దారిద్ర్యాంబుధి మగ్నునన్ బెనుప స । త్యంబిద్దియాఁ బాపసం
హారా! భక్తజనాభిలాషితద గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౧౩

మ॥ మును భక్తాళిని గాచినావనుచునిన్ । బూర్వుల్గడుం బాడిరా
ఘనమౌ పాట పురాణగాథయయగున్ । గాఁబట్టె యీవేళ దా
నిని సత్యమ్మని చెప్పకొంటకయి నే । నిన్వేఁడుచున్నట్టి న
న్ననఘున్ జేయవె, యవ్యయా సురభి గా। యత్రీదయాంభోనిధీ॥ ౧౪

శా॥ ఆపద్బాంధవ వీవటంచు మదిలో । నశ్రాంతమున్నమ్మి నే
నీపాదాబ్జయుగంబుఁ గొల్చితిఁ జుమీ । నిక్కంబుగా నీవహో
యాపద్బాంధవవైనచో నికఁను నా । యందున్ దయన్ జూపినా
యాపత్తుల్వడిఁ దీర్చి ప్రోవఁదగు గా । యత్రీ దయాంభోనిధీ॥ ౧౫

మ॥ ఇడుముల్ పెక్కులు పొందుచుంటె మనిశం । జే దేవికిన్ భక్తుఁడం
చడుగన్ నీదగుపేరు సెప్పనపుడే । హాస్యంబునవ్వారగు నీ
సెడుచో నాయపకీర్తి నీదియగుటన్ । జిత్తంబులో నెంచి నీ
యడుగుల్గొల్చెడు నన్నుఁ గావఁదగు గా।యత్రీదయాంభోనిధీ॥ ౧౬

శా॥ పుట్టంబోయెడు బాలునక్షుణముకై । పూబోండ్లకున్ మున్నెగాఁ
బుట్టించితీవు స్తనంబులన్ వెదకఁగాఁ । బోకుండఁగాఁ బాలకున్
గట్టాపుట్టి సమస్తకష్టములకున్ । బాలైననాకేమిటన్
అట్టేయుంచితివో కొకా తెల్పఁగదె గా। యత్రీ దయాంభోనిధీ॥ ౧౭

మ॥ ఒకనిన్ సాఁకితిమున్నటంచునను ని । ష్ఠూరోక్తన్న చోఁదల్లి సాఁ
కక యేలాగున సర్వరక్షిణి సమ । జ్ఞన్నీవు నైకొందువో
ఒకరోగిందగునట్లు కావనటకిం । కొక్కండు నాసిల్లిలా
నకటా పొమ్మన వెజ్జువాఁడగునె గా । యత్రీ దయాంభోనిధీ॥ ౧౮

శా॥ తప్పుల్ పెక్కులొనర్చినాననుచు హృత్కంజంబునం తేమొఁనూ
రప్పుల్సేసిన నీసుతప్పు లెపుడున్ । దండమ్ములో మాయవే

తప్పుల్బిడ్డలొనర్పఁ దల్లులకడన్ । దర్శింప నొప్పుంగదా
అప్పా తల్లివిబిడ్డఁగావఁగదె గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౧౯

మ॥ మము నీరీతిగఁ గోరఁగావలయునే । మాభక్తినిన్ మే మెఱుం
గమె రక్షింపమెయంచు నాడెదవొకో । మందేహ సంహారిణీ
అమయేనడ్గక పెట్టదన్న నుడి స । త్యంబేకదా యందుచే
నమరానోకహ వేఁడినానిటులు గా । యత్రీ దయాంభోనిధీ॥ ౨౦

శా॥ కల్పద్రుమ్మజము నెవ్వరేమడిగినన్ । గాదంటయేవేమి నా
కల్పాంతమ్ములదాఁకఁ గీర్తి వడయున్ । గాదేజగాలంపులీఁ
డల్పుండంచును వీడెనే యొకనినే । నాలాగునన్నిప్డు నీ
యాల్పుంగావఁగఁ జెల్లదే యిప్డు గా । యత్రీ దయాంభోనిధీ॥ ౨౧

మ॥ మును పెక్కండ్రను గావలేదె యహహా । ముల్లోకముల్మెచ్చఁగా
నినురక్షింపని నాక కీర్తియొకో కా । నిమ్మందువా యొక్క య
ర్థిని రక్షింపకయున్న దాతయొకొ ప్రా । ర్థిన్ బెక్కురన్ సాఁకినన్
అనఘాయాతఁడ దాతకాకరయ గా । యత్రీ దయాంభోనిధీ॥ ౨౨

శా॥ హృత్తాపంబుహరించు దేశికుఁడె యు । ర్వీన్ వేడుగా శిష్యుడా
విత్తంబున్ హరియించి మేడలను ని । ర్మింపంగ నాత్మార్థమై
సత్తీయందఱుఁ బెద్ద యొజ్జలగుటన్ । సత్యంబునా చిత్త మా
యత్తంబిప్పుడుచేసితిన్ దమకు గా । యత్రీ దయాంభోనిధీ॥ ౨౩

మ॥ కలిలో నైజపుజిత్తమన్ బొలము ప । క్వంబైనదో లేదొకో
తెలియన్జాలకమందులై గురులు ధా । త్రిన్ ఛాత్రులన్ గూర్చివా
రలకేమేమొ ప్రబోధచేసెదరు నే । రన్ వారల న్నన్మనా
కలహంబోఁడిరొకమ్మ దేశికవ్ర గా । యత్రీ దయాంభోనిధీ॥ ౨౪

శా॥ ఆకర్షింతురు వ్యాజదేశికులు కా । రాశాత్మలై యుండియున్
గాకున్నట్లు నటించుచున్ సిసుల ధా । న్యంబుల్ ధనక్షేత్రముల్
మీకేలా! యవిదుఃఖదమ్ములనుచున్ । మేధ్యాత్మ నీవట్లుగా
నాకర్షింతువు దుర్గుణంబులను గా । యత్రీ దయాంభోనిధీ॥ ౨౫

మ॥ ఉపదేశంబులు సేయుచుందురిల । శిష్యుండైనమాతాన్ఁ జి
త్తపరీపాకమెఱుంగకుండనె సుమం । త్రంబుల్ మహావాక్యముల్

విపరీతంబు ధనాశచే గురులు బ । ల్లేయట్లుగాకుండ నా
కపవర్గేశ్వరి నీవు దేశికవు గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౨౬

మ॥ ధనముం గోరక మాన్యముల్ గొనక త । త్త్వంబుం బరీక్షించి శి
ష్యుని కేవేళకు నేమిచెప్పవలెనో । యోచించి సత్పాత్రముం
గని బీజంబును బాత్రతన్ దెలిసి దా । నంబన్న న్యాయంబుగా
ననుకూలంబగు మంత్రమిచ్చెదవు గా । యత్రీ దయాంభోనిధీ ౨౭

శా॥ నిన్నే నమ్మెడునట్టివారరయగా । నీదాసులందా రెవ
రిన్నే వేఁడెడువారు వార్ధులను నే । నిక్కంబ బంధించెద
రిన్నే కొల్చెడునట్టివారు దధులన్ । నీరంతయున్ ద్రావువా
రన్నా నీదు మహాత్మ్యమెంతటిదో గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౨౮

మ॥ జనని కర్జము నేమిసేయుమని యా । జ్ఞాపింతువో నాకు దా
నినిమాత్రంబె యొనర్చుచుంటి నిజమిా । నీయాన నావంత దా
టను దక్షత్వము లేని నాకయిన గా । ఢంబైన కోపంబుని
కను లేపూనఁగఁ బిల్వనో యననీవు గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౨౯

శా॥ మ్రొక్కంగా వరమీయలేని తముకున్ । మ్రొక్కుల్ సమర్పించుచో
దిక్కేయేటికి నింక మ్రొక్కదనుచున్ । ధీగాళి నిందింత్రు నన్
మ్రొక్కులెక్కలొనర్చు నాపయిని నీ । క్రొక్కన్నులం జూపి యో
యక్కా కోర్కెలెల్లఁదీర్పఁగదె గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౩౦

మ॥ సుదతీ నీకృప దొంగవంటిదనుచున్ । ౧ సూత్రానులే పల్కఁ నా
శదకాలంబునఁ జెప్పకుండఁ జనుచున్ । భావంబుతో నుంటి నా
పెదదొంగన్ వెసఁబంపు సేవకుఁడు నీ । బిడ్డండు నీశిష్యుఁడ
ల్లదె కష్టంబుల బ్రుంగిపోయెడిని గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౩౧

శా॥ నిన్నే తల్లివిఁ దండ్రివిన్ గుఱుఁడవున్ । నిక్కంపు దేవుండవున్
మన్నీఁడంచు ననారతంబును మదిన్ । గాంక్షించు భక్తాళికిన్
బిన్నంబుల్లను దెంచునన్న జననీ । చిత్తుండు మ్రొక్కంగఁబో
నన్నాకో వెలమీఁదఁబడ్డటులు గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౩౨

మ॥ సుదతీ నీమనువున్ జపించుట వసి । ష్ఠుండాడె భాస్వంతుతోఁ
ద్రిదశాచార్యుఁడొసంగె నగ్నికిని శ । క్తినీటిలో నాఱన

---

౧ సూత్రానులు = నేర్పరులు

ట్లు దనుఁగన్ బ్రదికించె నుగ్రుఁడగుచున్ । ౧ లుక్కేమి రాకుండ నె
య్యది చేయంగను లేరు నిం గొలిచి గా । యత్రీదయాంభోనిధీ॥ ౩౩

శా॥ సూర్యుం గాంచిన జేరు వాలు మొగమున్ । జూపించకున్నట్లు ధీ
వర్యా నిన్ను జపింపనిక్కటులు పో । వన్ బోక స ధ్యాసతీ
ధైర్యంబంతె నశింపఁ జేసెడిని వి । స్తారంబులై నాకు నో
యార్యా హేతు వెఱుంగఁ జేయఁగదె గా । యత్రీదయాంభోనిధీ॥ ౩౪

మ॥ అయ దా యీశ్వరి కన్నతల్లికననే । యాటాడుచున్నా స్తనం
ధయుఁ బల్లాకియు వచ్చి పేర్మివిపమున్ । ద్రావింపఁగన్ దల్లిఁ జూ
చియు వారింపని తల్లియట్లగుఁగదా । చింతింపఁ గష్టాలు నీ
కయి ప్రార్థించెడు వారిఁ జేఁకటన గా । యత్రీదయాంభోనిధీ॥ ౩౫

శా॥ కాలంబింకను రానె లేదు నిలుమీ । కాలానుసారంబుగాఁ
జాలా నీకు సుఖంబు లిత్తునను చున్ । సర్వజ్ఞయం దేమొ స
హ్యాలంబందును బుటభూసురులు వి । స్తారంబు పండింత్రు నీ
యాలాపానసురత్వమేగనవ గా । యత్రీదయాంభోనిధీ॥ ౩౬

మ॥ ఋతుధర్మంబునఁ బణ్ణముల్ ఫలములున్ । వృక్షమ్ములీఁజూడు నీ
గతినింబట్టి ఫలంబులట్టులని ప । ల్కంజూచెదో యేమొ నా
గతికై నీవును వేచుచోఁకను సత్కల్యాణి యజ్ఞేశి నీ
యతులంబైన మహత్మ్యమేమిటిది గా । యత్రీదయాంభోనిధీ॥ ౩౭

శా॥ లోహవ్రాతమునుం గరంగెడిని రా । లుం గూడ నీరయ్యెడిన్
ఆహా వజ్రముకూడ వజ్రమున భి । న్నంబౌను మోచింపగా
నీ హృత్సారసమేమి వస్తువులచే । నిర్మింపఁగాఁ బడ్డదో
ఆహారప్రద మెవ్విధిన్ గరఁగు గా । యత్రీదయాంభోనిధీ॥ ౩౮

మ॥ జననీ నీహృదయంబహో మొదట వ । జ్రంబైనను బిమ్మటన్
వనమై తోఁచుటకున్ బహుల్ క్రమముగాఁ । బాధస్సునై తేనెయై
ననయై పండయి కొమ్మయై క్షితిజమున్ । గ్రావంబును లోహమై
అనపాయంబగు వజ్రమయ్యెఁగద గా । యత్రీదయాంభోనిధీ॥ ౩౯

శా॥ నీమంత్రంబు హరించు పాపములనే । నన్ జేయులే దెవ్వఁడీ
భూమీయందున నంచుఁ బల్కుదురహో । పూతాత్ములౌ వాకుసూ

---

౧ లుక్కు = లోపము

నీమంత్రానకశక్యమా దురితముల్ । నేఁ జేసియే యున్నచో
నా మాహాత్మ్యము నిన్ను మించునది గా। యత్రీ దయాంభోనిధీ॥ ౮౦

మ॥ జయమే నీదగు భక్తపాళికెటనే । సంతోషమే కాఁ బరా
జయమెన్నండును గల్గఁ బోవదనుచున్ । జాటించవింటిన్ బరా
జయ మేతెంచెడునట్లు దోఁచెడుఁజుమీ సర్వజ్ఞ నాకిత్తరిన్
అయదా యెవ్విధినన్నుఁ గాచెదవో గా। యత్రీ దయాంభోనిధీ ౮౧

శా॥ శ్రీ రాజిల్లకయుండు మానవుఁడు నీన్ । చిత్తంబులో నెంచి తాఁ
గోరన్ జేకురుచుండు లచ్చియవు । చే కోర్కెల్లను స్తంబునీ
కారుణ్యామృత వీక్షణంబుఁగన గా । తన్మోయెల్లవర్తించు ని
న్నారాధింపనివాఁడె మందుఁడగు గా। యత్రీ దయాంభోనిధీ॥ ౮౨

మ॥ అరియన్ బెక్కులు సంశయంబులెదలోనాక్రాంతమున్ దోఁచెడిన్
గురువుల్ వానిఁ దీర్చికొంటకయి నా । కున్ లేరునూ సేవయో
గురుపాపంబున నాకు ౧ ద్వాపరములన్ గూల్పంగ రాకున్నచో
నరవిందాసన నాకు నేదిగతి గా । యత్రీ దయాంభోనిధీ॥ ౮3

శా॥ నీమాహంబును జాటుచుండుదునుగదా । నిక్కంబుగా నెప్పుడున్
నీ రేజాప్తుఁడు రాత్రివల్లభుఁడుడుల్ । నీకంటె పేరెన్నరు
న్నారే యజ్ఞులు నిన్నుఁ గానక మహా । సందాప్తి కెంచెందనో
యారాటంబునఁ దిర్గుచుండెదరు గా। యత్రీ దయాంభోనిధీ॥ ౮౪

మ॥ చతురాస్యుండవు నీవయంచనిన శీ । ర్షం బాతఁడా నీకు న
చ్యుతుఁడీవన్న నతండు నీహృదయమా । నుగ్రుండునుం జుట్టగున్
క్షితియారీతిగ యోనియౌను * గణకున్ నీ మోముగా నయ్యెడిన్
అతివా వీకలు నీవుగావుగద గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౮౫

శా॥ ఆదిన్ ముప్వురు మూర్తులెన్నఁగఁ ద్వదీయంబైన యంశంబులే
కాదా వారల సేవచేయనలెనా । కాంక్షించి నిన్నెప్పుడున్
శ్రీదాయీ! దనుజాంతకా! నిరయహా । చిత్తంబులో నెంచుచో
నాదివ్యంబు పదంబు చేకురదె గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౮౬

మ॥ జననీ యొక్కటి విన్నవింతు వినునీ । సాన్నిధ్యముందుండి నా
మనసో చంచలమాట నీభజనమున్ । మాటన్ వినంగానె యొ

---

౧ ద్వాపరము = సందేహము, * కణకు = అగ్ని

దునకో పోయెడు నేమి మోవినెడు సం। దుర్గ జూచెడిగాన న
న్ననఘుండ జేయఁగ నీదె భారముచు గా। యత్రీదయాంభోనిధీ॥ ౮౭

శా॥ అబ్ధిన్ గ్రుంకిన మున్గినను వి। ష్ణ్వారాధనం బేని యా
రబ్ధంబైనను గాశికాదిపురముల్। రక్షిన్ విలక్షింపఁ బా
రబ్ధంబుల్విడనాడు నేనరుని నీ। వాపంద లేకున్నఁ బా
పాబ్దాఘోగ్ర విభంజనాజనని గా। యత్రీ దయాంభోనిధీ॥ ౮౮

మ॥ జననీ విన్నఁ ఘమాలకింపఁదగునా। స్వాంతంబ దెల్లప్పుడున్
ఘనుడా సారధి లేని గట్టిముఁవలెన్। బల్పోకలన్ బోవు నె
వ్వని నే లక్ష్యము సేయఁబోదగుట నీ। బాలున్ విచారించి నీ
వనఘా సారథివై మరల్పదగు గా। యత్రీ దయాంభోనిధీ॥ ౮౯

శా॥ లక్ష్మీవంతుఁడు కాఁదలంచునగుఁడే। లక్ష్యంబుతో నెమ్మదిన్
సూక్ష్మంబైన త్వదీయమా మనువు సం। స్తోత్రంబు గావింపనా
లక్ష్మి చంచలమైనవానికడ నె। ల్లప్పున్ వసించున్ గదా
హా త్మ్మానీకు నసాధ్యమేయొకటి గా। యత్రీ దయాంభోనిధీ॥ ౯౦

మ॥ పుసుకన్ శంఖము చక్రమం కుశకశాం। భోజాతముల్ చేతులం
దునమాత్రంబు ధరించునన్ గొలువ సం। మోదంబు నీకబ్బు నే
య నెదే మీ యవిసుష్టకర్ములను సంహారంబు గావించెడిన్
అనుకూలంబుగ సాకుమమ్మవియ గా। యత్రీదయాంభోనిధీ॥ ౯౧

శా॥ నీమంత్రంబు మహాత్మ్య మిట్టిదనుచున్। జెప్పన్ క్షముండెవ్వఁడో
యేమంత్రంబుఁ బఠింపఁబూనినసరే। యేవిప్రుఁడే కానియున్
నీమంత్రంబు జపింపకుండ మొదటన్। ధిక్కారమున్ జేయ లే
డామంత్రంబుఁ ద్విజోత్తునేయొకను గా। యత్రీదయాంభోనిధీ॥ ౯౨

మ॥ మనువులోఁ ట్లకొలందియుండిన మహా। మాయాత్వదీయంబు స
న్మనువున్ దొల్త జపింపకున్నపుడు శూ। న్యంబౌను సత్యంబు పా
వనతంచున్ బలుకాడుచుండెదరు వి। ద్వాంసుల్కడా కానయా
యనఘంబౌమనువున్ ద్విజింతునొకొ। గాయత్రీదయాంభోనిధీ॥ ౯౩

శా॥ నీమంత్రంపుబలంబెపో బలముగున్। నిక్కంబుగా వేనవే
ల్గామాతా కలయట్టి మంత్రములకున్ గాఁబట్టి యెల్లప్పుడున్

నీమంత్రంబు జపించు బ్రాహ్మణునకున్ ౧ ధిష్ణ్యంబు వర్ధిల్లఁగా
నామంత్రింబుఁద్యజించువాఁడఘుఁడు గా। యత్రీదయాంభోనిధీ॥ ౧౪

మ॥ సంధ్యావందనమాచరించి పిదపన్ । శైవాది మంత్రమ్ములన్
వింధ్యాద్రీశ్వరి కోట్లుగాఁ దలఁచినన్ । ధిష్ణ్యంబు నీదౌట ని
ర్మాంద్యుండౌచు జపించుచో నిను నటుల్మాహాత్మ్యమెంతబ్బునో
అంధ్యంబందు మునింగినేఁ దెలియ గా। యత్రీదయాంభోనిధీ॥ ౧౫

శా॥ లభ్యంబయ్యెఁ ద్వదీయమంత్రమిఁక నేలా వీడుదున్ ధాత్రి వాక్
లభ్యంబౌనది యేదిలేదుకద! సా। లభ్యంబు నీమంత్రమే
సభ్యత్వమ్మున నుండఁజేయునిఁక నే। స్వామిన్ దలంపన్ జుమీ
అభ్యర్థించెదు నన్నుఁ బ్రోవగదె గా। యత్రీ దయాంభోనిధీ॥ ౧౬

మ॥ అరయన్ సేవ్యము చేసినన్ మఱియు నే। వ్యాపారమున్ జేయదు
ర్భరమౌ పన్నులువచ్చి మీదఁబడు భూ। పాలాజ్ఞచే వెంట నీ
వరమంత్రంబు జపంబు సేవ్యమునవే। పన్నుండఁబోదందు చే
నరవిందాన జపింతు నీమనువు గా। యత్రీ దయాంభోనిధీ॥ ౧౭

శా॥ శబ్దార్థంబులు పెక్కురీతుల నిరున్ । జాటున్గదా వానినే
యబ్దంబుల్ యుగముల్ననున్ దెలియఁగా। నాయుస్సునాఁ తేండ్లెయా
శబ్దార్థంబులతోడ నేమియని నా। స్వాంతంబు నిన్ జేరెఁ బా
పాబ్ధవ్రాత విభంజనాకొనుము గా। యత్రీ దయాంభోనిధీ॥ ౧౮

మ॥ ధనమార్జించుట పౌరుషంబయనుచున్ । దౌర్భాగ్యమాబుద్ధి నా
ధనమార్జింపఁగ రిత్త చేసితిఁజుమీ। తథ్యంబుగాఁ గాలమున్
వినియోగించెద నింకనా సమయమున్ । నీమంత్రమున్ బాడఁగా
ననఘా యిప్పుడు నన్నుఁగావఁగదె గా। యత్రీదయాంభోనిధీ॥ ౧౯

మ॥ తలినీ మంత్రముచేత నేరద ద్విజ। త్వమ్మున్ ద్విజుల్గాంచి వి
ద్యలనార్జించి విభూతులన్ గొని ఋషి। త్వమ్మున్ సమార్జించి శ
త్రుల దర్భల్గొసి యెందు నిర్భయముతోఁ। దున్మాడుచున్నారు నీ
యలఘుప్రజ్ఞనుతింప నాతరమె గా। యత్రీ దయాంభోనిధీ॥ ౨౦

మ॥ ధనమున్నప్పుడ యన్నదమ్ములతిగా। దాలుండు మాన్యంబులు
న్ననొ గల్లంమనఁ బంటలన్ భయముగున్। భద్రాత్మకామెప్పు డె

---

౧ ధిష్ణ్యము = బలము

వ్యసివేచీయొనఁగూడఁబట్టిదగు భ । వ్యంబైన నీ మంత్రమే
సనయంబుల్ జపియింతుఁ జిక్కనది గా । యత్రీదయాంభోనిధీ ॥ ౬౧

శా॥ భక్తిన్నిన్ను భజించుమానవుల పా । పంబుల్వెసన్ బాపి యా
సక్తిన్ మోక్షము నొసంగుదానవను నా । సకీర్తనవ్వింటి స
ద్వ్యక్తుండన్ భజియింపనేరను భవ । త్పాదాబ్జముల్పట్టితిన్
ద్వ్యక్తున్ జేయక యెట్లుకాతునను గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౬౨

శా॥ ఆర్తత్రాణపరాయణా! శశిముఖీ । హంసాధిరూఢాసతీ,
వర్తిల్లన్ భవదాజ్ఞయందు జడుఁడే । విష్ణుంబులన్ వాయునిన్
గీర్తింతున్ నిరతిన్ మదీయ వినుతుల్ । కేషింపకల్పాంతసం
చార్తిన్ జెందిన నన్నుఁ బ్రోవఁగదె గా । యత్రీదయాంభోనిధీ ॥ ౬౩

మ॥ ధరనేమర్త్యుని నాశ్రయించిఁ దలిఁ, దౌర్భాగ్యమేమున్న దు
ర్భరమా కష్టము లేగుదెంచిన తరిన్ । రక్షింతు నిన్నంచు నో
ర్పుఁడేనిన్ బలుకాడ నేరఁడుగదా । కల్యాణి నీయాశ్రయం
బరలేపట్టి యమర్త్య భూరుహము గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౬౪

శా॥ శక్యంబయ్యెడు నె త్వదీయ మహిమల్ । స్తోత్రంబు గావింపఁ జా
ద్రక్యంబేమియు లేక యన్నిఁట భవ, ద్దివ్యంబు రూపంబె యే
వాక్యంబందునఁ గానవచ్చుఁ దెలియన్ । భ్రష్టుండ నీలోననే
నైక్యంబయ్యెడు దారిఁజూపఁగదె గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౬౫

శా॥ జననీ నీదు ప్రభావముల్ దెలియఁగా । సామర్థ్యమేముండు మ
ర్త్యనరున్ దంతిని బెద్దజంతువులలో । దోమన్ దదాకారమై
తనరన్ సూక్ష్మపు జీవులం గనిటయున్ । దద్రూప యుగ్మంబులో
వనయంబున్ వెలుఁగొందుచుండెదవు గా । యత్రీదయాంభోనిధీ ॥ ౬౬

శా॥ దుర్వారంబగు సంసృతిన్ మునిఁగి సం । తోషించుటే కాని నా
దౌర్భాగ్యంబెటులాగునో యెఱుఁగఁ, జూ । దాష్ట్యంబు మన్నింపవే
యూర్ధ్వాటంబున నిన్ను నెమ్మనములో । నశ్రాంతము న్వేఁడు నీ
యుర్వ్యుల్ బ్రోవఁగ నీదె భారమగు గా । యత్రీ దయాంభోనిధీ ॥ ౬౭

మ॥ జలమందెన్నికకాల సత్వముల మున్ । సంసృష్టిఁ గావించితో
స్త్రీమందన్నికకాల సత్వములనున్ । దయాస్పష్టరూపంబుగాఁ

గలుగఁజేసితి ౧ తారుకాణముగ న । క్రింబుఁ దలీ * వల్లినీ
యలఘు ప్రతిజ్ఞనెఱుంగ నాతుమె గా । యత్రీదయాంభోనిధీ॥ ౧౮

శా॥ రౌద్రంబై కనిపించుచుండెడు భవ । ద్దివ్యంబు రూపంబె సౌ
భద్రంబై యొకసారితోఁ చెడుఁజుమీ । భావించిచూడంగ న
క్షుద్రంబైన త్వదీయరూపమెఱుఁగఁ । క్షుద్రుండనేనమ్మ విం
ధ్యాద్రీవాసిని నన్నుఁగావఁగదె గా । యత్రీ దయాంభోనిధీ॥ ౧౯

మ॥ భవదాకారము నిట్టిదంచుఁదెలుపఁ । బ్రహ్మాండమున్ సృష్టిచే
సి వినోదంబులు పెక్కుతీర్పరచి వా । సింగంటివో తల్లి ని
వివిధాకారములఁ గనన్ గనుఁగవన్ । విశ్వేశ్వరీ యిచ్చినా
నవియేలాగునఁ జూడఁజాలుదును గా । యత్రీదయాంభోనిధీ॥ ౨౦

శా॥ విశ్వంబంతయు నీమహాత్మ్యమున నే । వెల్గొందుచుండున్ సదా
విశ్వామిత్రులు మిత్రులౌదురు కదా । ప్రీతిన్ నినున్ వేఁడినన్
విశ్వాధీశ్వరి నీకసాధ్యమొకటుం । డేయుండునే చూడఁగా
నైశ్వర్యప్రద నన్నుఁగావఁగదె గా । యత్రీ దయాంభోనిధీ॥ ౨౧

మ॥ తలిసీవెందుననైనఁ గన్బడుటచే । తన్ జూచుచున్నట్టి వా
రలు ద్వైతంబని కొందఱాడెదరు సూ । బ్రహ్మణ్యులైనట్టి వా
రలో యద్వైతమటంచు నాడెదరు నిన్ । ప్రార్థింతునా రెంటిలో
నలరన్ దగ్గదియేదో తెల్పఁగదె గా । యత్రీ దయాంభోనిధీ॥ ౨౨

శా॥ పృథ్వీ! నిన్నొకసారియేఁ దలఁచుచో । నెన్నని పాపంబులే
విధ్వంసంబగునంచుఁ బల్కుదురహో । పేమారు నిన్వేఁడుచో
నధ్వాన్నంబగు జన్మమేని సఫలం । బైయొప్పదే కాదె మో
క్షౌధ్వంబెన్నఁ బెరంటి కల్పకము గా । యత్రీ దయాంభోనిధీ॥ ౨౩

మ॥ జగమున్ సృష్టియొనర్తు వీవయనుచున్ । సంవాదమున్ జేతురీ
జగమే నైజముగా జనించెననుచున్ । సంప్రీతి వారింతురీ
జగడంబందున నేది నమ్మఁదగునో । సంధ్యా వచింపంగదే
అగచాట్లన్నియుఁ దీఱిపోవఁగను గా । యత్రీ దయాంభోనిధీ॥ ౨౪

శా॥ సర్వేశ! మనువారమీవలన నే । జన్మించెనంచున్ సదా
సర్వామ్నాయములాడుచుండు సఫలా! । సత్యా! సుధీ! కావునఁ

---

౧ తారుకాణము = దృష్టాంతము     * వల్లి = బల్లి.

సర్వార్థప్రద యెట్లు జప్యములగున్ । సత్యంబుగా నన్నియున్
అర్వాచీనముగాన నీకరయ గా । యత్రీ దయాంభోనిధీ॥ ౭౯

మ॥ స్థిరమా బ్రహ్మను నాకు నీతఁడనుచున్ । జెప్పంగ నీవుండఁగాఁ
బరునిం జెప్పమటన్న నంతికమునన్ । వర్తిల్లుచుండన్ సుధా
వరభాండంబుఁ బరిత్యజించుచు సురా । భాండంబునుంగోరి న
ట్లరవిందానన యాచనుండఁగద గా । యత్రీదయాంభోనిధీ॥ ౭౬

శా॥ దర్పాంధుండను గొల్వనేరను నినున్ । దర్పించి పాపంబు తా
సర్పంబట్టులు పొంచియున్నదిచుమీ । జాతీయ మీ మోతలీ
కూర్పాసంబు త్వదీయనామముకదా । గోసుల్ వెసన్ దీర్పవే
యర్పింతున్ గొను నీకు నెమ్మనము గా । యత్రీదయాంభోనిధీ॥ ౭౭

మ॥ బలినీకర్పణ మేమిచేయవలెనో । భక్తప్రియా యెన్నఁడేన్
దెలియన్ జాలని మాట మొద్దునగుటన్ । నిర్లోభసంప్రీతితోఁ
దెలియంజెప్పెడివారు లేరగుటచే । దేవీ హృదబ్జంబినే
యలరర్పించెదఁ బ్రీతిఁగైకొనుము గా । యత్రీదయాంభోనిధీ॥ ౭౮

శా॥ విఖ్యాతంబు సమస్తవిప్రులకుఁ బా । విత్ర్యంబు నీమంత్రమా
ముఖ్యంబంచుఁ దలంపకెన్నఁడకటా । మూఢాత్ములై యేదియో
యాఖ్యానమ్మునునమ్మి నెమ్మనములన్ । హాళింతు రెల్లప్పు స
ద్వ్యాఖ్యన్ జేయఁగ లేరునీయభిధ గా । యత్రీ దయాంభోనిధీ॥ ౭౯

మ॥ మునులా బ్రహ్మపదంబుఁ జేరుటకునై । మున్నేమిమంత్రంబుతో
నినుధ్యానించిరో నేనెఱుంగనుగదా । నిర్వాణ సంధాయినీ యా
ఘనమంత్రంబును నాకుఁదెల్పి యికనీ । కారుణ్యమున్ జూపి న
న్ననఘున్ జేయవె నిన్ను నమ్మితిని గా । యత్రీదయాంభోనిధీ॥ ౮౦

శా॥ శాస్త్రీయంబుగఁ జాలకాలము దా । శ్రద్ధాళుఁడై యెన్ని యో
శస్త్రాస్త్రంబులు నేర్చినన్ దపమునన్ । సద్వంశజుండైనను
వస్త్రాద్యాభరణాది భూషితుఁడునై । నన్ దావకీనమ్ము బ్ర
హ్మాస్త్రంబున్ నిరసింప వేమగద గా । యత్రీ దయాంభోనిధీ॥ ౮౧

మ॥ పిడుగుల్ వ్రాలినయట్టి కష్టములె యా । వేశించి యున్నట్లు డా
న్నఁడు స్వప్నంబున నిన్నెఱుంగనతఁడున్ । సద్భక్తిధ్యానించుచోఁ

బిడుగుల్పుష్పములట్టులౌ ననుచు నే । విన్నానుగాఁబట్టి నీ
యడుగుల్గొల్చెద నన్నుఁ గావఁగదె గా । యత్రీదయాంభోనిధీ॥ ౮౨

శా॥ తక్కిన్ నిన్ను మనంబునన్ దలఁచుచో । దాష్టంబు వాటిల్లునే
యన్వేషించుచు నె కాలుఁడాతనికినై । యాయాసమున్ గల్గునే
మనావదు ల్లినుఁ గొల్చుచుంట నెకదా । మాన్యాత్ముఁడై కాటఁ బిం
కాన్వితుండను నిన్ను నమ్మితిని గా । యత్రీ దయాంభోనిధీ॥ ౮౩

మ॥ ఇల నాహార మనొక్కటైననుసరే । యొల్లప్పుడుండన్ దగున్
గులభేదంబులటంచుఁ దెల్పుటకునై । గోర్కెన్ విభేదంబు ప
క్షులలో వన్యమృగంబులన్ బసులలోఁ । గూడన్ బ్రకల్పించు నీ
యలఘు ప్రతిజ్ఞ నుతింతు నెమ్మదిని గా । యత్రీదయాంభోనిధీ॥ ౮౪

శా॥ కార్యంబుల్ సమకూరవే నినుమదిన్ । గాంక్షించి ధ్యానించుచోఁ
గార్యంబంతయుఁ బోవకున్న యరి । వర్గంబైనఁ జాకుండునే
వీర్యంబెంతయుఁ బుట్టదే మనమునన్ । వేర్పాటు వాటిల్లునే
యార్యా బాలుఁడ నిన్నుఁ జేరితిని గా । యత్రీదయాంభోనిధీ॥ ౮౫

మ॥ అమరో తండిరికంటెఁ దల్లిదయ యం । దాధిక్యతన్ జూపునం
చు మహాత్ముల్లలపోసిపోసి యనినున్ । ముమ్మాటికిన్ మాత్రయీ
కమనీయాంబవటంచుఁ బల్కిరటులన్ । గానంబు గావించు న
న్నమలంబౌ దయఁజూపి కావఁదగు గా । యత్రీదయాంభోనిధీ॥ ౮౬

శా॥ సద్వంశమ్మునఁ బుట్టినన్ నిరతి ప । ట్టాభద్రుంబులన్ నేర్చినన్
విద్వాంసుఁడని పేరుగాంచి సభలన్ । విఖ్యాతినింబొందినన్
విద్వేషంబులుపోవునే తనకు హ్యా । ద్వ్యాధిన్ నినుఁ గానమిఁ
అద్వైతంబు ఘటిల్లునే మదికి గా । యత్రీ దయాంభోనిధీ॥ ౮౭

మ॥ జనులం దెచ్చును దగునున్న దనుచుఁ । జాటించుకోసంబు కాం
చనకావ్యాది సులోహ జాతములలో । నగరాలలోఁ గూడ నె
చ్చునుదగ్గుఁ బ్రకటించునట్టిదగు నీ । చొక్కంపుఁ బ్రాభావమే
ననయంబుఁ మదిలోఁ దలంచెదను గా । యత్రీదయాంభోనిధీ॥ ౮౮

శా॥ ఎవ్వాఁడిద్ధరనిన్ను నెమ్మనములో । నెంచుఁ సదా ప్రీతితో
నవ్వానిఁ గృపతోడఁ బ్రోతువని యా । యామ్యల్నుతుల్సేతురో
అవ్వా బాలుఁడఁ బాపకర్ముఁడ నిను । న్నశాంతమూహించునా

కటాక్షింపఁ దయచేయు మోక్షమును గా।యత్రీదయాంభోనిధీ॥ ౮౯

మ॥ తులసీపత్రము నేసినంతనె రుచుల్ । తోయంబునన్ మాఱున
ట్లలరుం బోడిరొ నీపదాంబుజములన్ । ధ్యానించు మాత్రాన భ
క్తుల తత్త్వంబును మాఱఁగావలయు సం। తోషప్రదాయింకనా
యలతత్త్వంబును మార్పవేమిటికి గా। యత్రీ దయాంభోనిధీ॥ ౯౦

శా॥ కష్టంబు ల్సనుదెంచుకాలమున నిన్ । గామించి ప్రార్థింప నా
గష్టంబుల్ వెసఁబాసియున్ సుఖము లక్కాలానఁ। బ్రాప్తింపవే
దుష్టాత్ముల్ హితులై కనంబడరె సం। తోషాబ్ధిలోఁ దేల్పవే
అష్టైశ్వర్యములీయవే యపుడ గా। యత్రీ దయాంభోనిధీ॥ ౯౧

శా॥ నీ మంత్రంబును బాడినన్ మనువుల । న్నింటిన్ రతిన్ బాడిన
ట్లే మాన్యంబగు రూపుగొల్చిన వ్యాపీ। కేశాదులన్ గొల్చిన
ట్లే మాన్యాఖిల మంత్రదేవమయవై । యావుందుటం జేసి నే
వా మంత్రంబును రూపముం దలతు గా। యత్రీదయాంభోనిధీ॥ ౯౨

మ॥ పరదేవార్చన భక్తిపూర్వకముగా । వాగీశ కావించినన్
స్థిరమై యయ్యది నిన్నుఁజేరునయినన్ । నిక్కంబు యోచించు వో
సురవంద్యా విధికాదు కాదవిధియై । చూపట్టు నట్లాటచే
నరవిందానన నీమకొల్వు విధి గా। యత్రీ దయాంభోనిధీ॥ ౯౩

శా॥ ఏకాలంబున నీదు భక్తులకుఁ ద। ల్లీ యేది యావశ్యకం
బా కాలంబున కాపదార్థ పితతిన్ । హర్షంబుతో నిత్తువా
నీకల్యాణ గుణంబెఱుంగమి నదే। నిక్కంబయిమ్మాచు ని
న్నాకాంక్షించుట భక్తుఁడౌనతఁడు గా।యత్రీదయాంభోనిధీ॥ ౯౪

మ॥ కమలాక్షుండును వహ్నినేత్రుఁడు మొద। ల్గాగల్గు దేవాళి వి
శ్వమయత్వంబునులేని వారగుటచే। సంధ్యా మహాదేవి వా
రి మహత్వంబును స్వల్పమాశ్రితుల యా। త్రింపీర్చుటల్లాటఁగా
ల్త మరో విశ్వమయత్వమున్న నిను గా। యత్రీదయాంభోనిధీ॥ ౯౫

శా॥ దుర్వార్యంబగు కార్యముల్ సలుప నీ। తోడ్పాటునుంబొందువాఁ
డుర్వి చక్రమునందు సార్థకుఁడుగా। నుండున్ గదా యెవ్వడున్
గర్వాంధుండయి నిన్నువీడి యెదియే। కావించునే పూర్తిగా
నర్వంబై యలరారుగాక యది గా। యత్రీ దయాంభోనిధీ॥ ౯౬

మ॥ భ్రమరధ్యానముచేతఁ గీటముద్విరే। ఘంబైనచందాన నీ
యమలధ్యానముచేత భక్తుఁడును నీ। వై పోవుటబ్రింబె ధ్యా
నము చేయందగునట్టి మార్గమెదియో। నా కానతీయంగదే
అమరాధీశ్వర సన్నుతాంఘ్రియుగ గా। యత్రీదయాంభోనిధీ॥ ౯౭

శా॥ కర్తవ్యంబులవెవ్వియో యెఱుఁగ నిన్। గాంక్షించి యర్పింప స్ఫూ
ర్తిన్ జూపి త్వదీయ పుత్రునకు సం। పూర్ణంబుగా ప్రేముడిన్
గర్తవ్యంబు లెఱుఁగఁజేయఁగదవే। కల్యాణమీయంగదే
ఆర్తత్రాణ పరాయణా శుభద గా। యత్రీ దయాంభోనిధీ॥ ౯౮

మ॥ పరుసంబున్ వెసఁదాఁకినట్టి యినుమున్। బంగారమైనట్లు నీ
చరణద్వంద్వముఁ దా। కినప్పుడుక దా! సద్భక్తుఁడీవోట నీ
యిరవేదో తెలియంగఁ జాలనుజుమీ। యింకేదయన్ జూపి నీ
యరవిందాంఘ్రులుదాఁక నీయఁగదె గా।యత్రీదయాంభోనిధీ॥ ౯౯

శా॥ ఎగ్గుల్సేసితి బుద్ధిహీనతను నే। నిక్కాలపర్యంతమున్
నెగ్గింపందగు దేవినీవనుచు నే। నీ ప్రాపున్ గోరితిన్
నుగ్గాడంగదె పాపకాననములన్। నూఱాఱులన్ బ్రీతిని
న్నగ్గింపంగలనే బుధాళివలె గా। యత్రీ దయాంభోనిధీ॥ ౧౦౦

మ॥ పువ్వుంబుట్టఁగఁజేసి మొట్టమొదటన్। బూబోడి యాపైనఁగా
యవి నిర్మింతువుచుమ్మి చెట్టులకు నమ్మాత్రీ వెలంగొన్నిఁటన్
బువుకంబె న్నలపిందెఁ దోట్టతోలుతన్। బుట్టించుచున్నావుగా
అవురా నీదగు ప్రజ్ఞనేమనుదు గా। యత్రీ దయాంభోనిధీ॥ ౧౦౧

మ॥ జననీ పూవును గొన్నిఁటన్ దొలుతనే। జన్మింపఁగాఁజేతు పిం
దెను గొన్నింటనఁబుట్టఁజేతు తొలి గొ। న్నింటన్ విచారింపఁగా
యనుమాత్రంబె సృజింతువా పువును ర। వ్వంతైన లేకుండ నే
మనివర్ణింతును నీదు ప్రాతిభను గా। యత్రీ దయాంభోనిధీ॥ ౧౦౨

మ॥ జననీ ముందుగఁ గాయనేర్పరచి యా। సద్గర్భమందెన్నొ వి
త్తనముల్నిల్పియు సృష్టికెంతొ విపరీ। తంబట్లుగా జేడిగిం
జనో యాపందున వెల్పటుంచితివి నీ। చాతుర్యమేమందునే
అనవద్యాత్మక చిత్రసృష్టిరత గా। యత్రీ దయాంభోనిధీ॥ ౧౦౩

మ॥ శివుఁడే వెన్నునికంటె గొప్పయనుచున్। జివ్వల్ కడున్ జేయ వా

ధవుఁడే భర్గునికంటెఁ బెద్దయనుచున్ । ధర్మజ్ఞులేయందురా
శివనారాయణులట్లు భేదమెపుడున్ । జెప్పంగ వీల్కాదు సు
మ్మవనీనాకముగాన నిన్గొలుతు గా । యత్రీదయాంభోనిధీ॥ ౧౦౪

మ॥ రమనీదైన సదాజ్ఞచేతఁగద సూ । ర్యాచంద్రులు న్వేలు ట
గ్ని మహాతీవ్రముతోడ మండుటయు వెం । డిన్వీచుట ల్వాయువున్
గ్రమమున్దప్పక యిట్టినీ మహిమ న । జ్ఞానంబునందుంటచే
నమరో సుంత యెఱుంగనయితిఁగద గా । యత్రీదయాంభోనిధీ॥ ౧౦౫

శా॥ నీమంత్రంబు సమస్త శాస్త్రపులకున్ । దివ్యాస్త్రమై తోఁచెడిన్
నీమంత్రంబు సమస్త రోగములకున్ । దివ్యౌషధంబయ్యెడిన్
నీమంత్రంబిల మోక్షరాజ్యమునకున్ । నిశ్రేణికామైతగున్
ఆమంత్రంబును వీడఁగాఁదగునె గా । యత్రీ దయాంభోనిధీ॥ ౧౦౬

మ॥ శ్రుతులన్నింటిఁ బఠించినన్ సుమతియై । చోకారమాపా మహా
క్రతువుల్సేసిన భూరిదక్షిణలఁ దీ । ర్థవ్రాతమున్ గ్రుంకినన్
రతి వృద్ధాఫలమెంతో యంతయగునిన్ । భావింప నశ్లాటచే
నతులంబై తగునిన్నునేఁ దలఁతు గా । యత్రీదయాంభోనిధీ॥ ౧౦౭

శా॥ నీమంత్రంబు జపింపఁగాఁదగరు వా । ణీ, నారులంటారు కా
నీమంత్రంబు జపించు వారులకునే । నిర్వ్యాజమా ప్రేమతోన్
సామంతా పొడకట్టిపల్కెఁదగుటన్ । సామప్రియా చక్రిణీ
ఆమాటెట్టులు నమ్మఁగాదగును గా । యత్రీ దయాంభోనిధీ॥ ౧౦౮

శా॥ శ్రీవత్సాభిదగోత్ర సంభవుఁడ నా । ర్వేలాడ రంగాఖ్యుఁడన్
బ్రావీణ్యంబు భవత్కృపారసమునన్ । గల్గంగ సల్పించితిన్
నాపిల్లైనటు నూటయెన్మిదిఁటినిన్ । శార్దూల మత్తేభముల్
ఆవంతేనియుఁ గోపగింపకుము గా । యత్రీ దయాంభోనిధీ॥ ౧౦౯

శా॥ అనయము స్వస్వరూప పరి । శోధిత హృత్సరసీరుహాంబునన్
మనము లయంబుజేసి ప్రణ । వంబు జపించు మహానుభావునిన్
ఘనయశు బ్రోవుమో జనని । గాధితనూజుని శిష్యసూనునిన్
యనిమిదిసంఖ్యనొప్పు గృహి । నాముని వెంకటసుబ్బయార్యునిన్॥ ౧౧౦

సమాప్తము.

# ప్రకటన.

ఈ కవి విరచితమై విక్రయమునకు సిద్ధముగ నున్న గ్రంథములు -

౧ ఆంధ్ర చంపూ రామాయణము సంస్కృతమున భోజరాజ విరచితమైన చంపూరామాయణమునకు సరియైన యాంధ్రపద్య గద్య కావ్యము వెల రు. ౧—౦—౦

౨ అలికాకలు ( బాగడాడు మంగలివాని గర్వభంగము ) ఇంగ్లీషు నుండి తెనిఁగింపఁబడినది. వెల రు. ౦—౨—౦

3 శ్రీ గాయత్రీ భజనగీతామృతలహరి (గాయత్రి భజన కనుకూల మగు కీర్తనలు) వెల రు. ౦—౪—౦

వలయువారలిట్లు వ్రాయవలెను:—

పూసపాటి రంగనాయకామాత్యకవి
గుంటూరు జిల్లా
బాపట్ల తాలూకా
పూసపాడు.